# అంకితము



వాస్తుజ్యోతిష విద్వాన్, దైవజ్ఞ రత్న,
**కీ.శే. బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ,**
**కీ.శే. రాజ్యలక్ష్మి**

కర్మ ఫలము ననుభవించcగ నిల మేను
నిచ్చి పెంచి చదువు సంధ్యలిచ్చి నట్టి
పుణ్య జననీజనకులకుc బొత్త మంకి
తమ్ము నిత్తుc గృతజ్ఞతం దలను వాంచి!

ఏమి యైన సాధించిన నింతదనుక
నెల్ల యది మీరు పాతిన చల్ల చూడ్కి
యే కతమని భావించెద! నీ జనువిటు
లాయె మతియెన్ని పుట్టుల మోయవలెనొ!

– కవితా ప్రసాద్

# మాట వెలదులు

## (పరశ్శతకము)

**కవితా ప్రసాద్**


శంకరాభరణం ప్రచురణలు



శంకరాభరణం

శరణం పండిత మానసాపహరణం, శశ్వద్యశఃకారణం, సరసానందద వాగ్విలాస చరణం, శబ్దార్థ సంపూరణమ్।
చరదత్యద్భుత సత్కవీశ్వరగణం, సాలంబనం 'శంకరాభరణం', నిత్యమహం స్మరామి విలసద్ వాగ్దివ్యసింహాసనమ్।

**మాట వెలదులు (పరశ్శతకము)**

రచన: కవితా ప్రసాద్



**ప్రథమ ముద్రణ**: జులై 2021

**కాపీలు**: 100

**శంకరాభరణం ప్రచురణలు**: 54

**ప్రాప్తిస్థానం**: Kavitha Prasad,
73-18-8/1F, S2 - Sree Nandanam Apt.,
Sree Balaji St., (Near Venkateswara Temple),
A.V. Apparao Road,
Rajamahendravaram-533103 (AP)
✆: 9490168907

**వెల**: అమూల్యము

**డిజైన్ & డి.టి.పి.**: పంతుల విట్టుబాబు, హైదరాబాద్, ✆85550 82034
**ముద్రణ**: ముద్రికా ప్రింటర్స్, విజయవాడ, ✆94401 59456




## శ్రీ ఎర్రాప్రగడ రామకృష్ణ

ప్రముఖ రచయిత-సాహితీ వేత్త
రాజమహేంద్రవరము


# సంభావన

**క**వితా ప్రసాద్ గారు గొప్ప చదువరి. మంచి పండిత కవి. పద్యానికి కవిత్వానికీ కాస్త ఎడం ఉంటుందనే విషయం ఎరిగిన పద్య కవి. అంటే ఛందస్సు తెలిసినంత మాత్రాన, కవి కాబోడనే విషయం ఎరిగిన పద్య కవి. అవనిగడ్డ బిడ్డగా ఉన్నప్పుడే క్లాసులో ఇంగ్లీషు పాఠాలు వింటున్నట్లు నటిస్తూ తెలుగు పద్యాలు అల్లుకొన్న చమత్కారి. ఉద్యోగ బాధ్యతలనుంచి విడుదల అయ్యాక సద్యః ప్రవృత్తి ప్రేరణతో పద్య రచనకు పూనుకొన్నారు. ముచ్చటగా మనకు "పంచారు". పైగా "మీకు చదివే అవకాశం ఇస్తున్నాను" అని హుందాగా ప్రకటించారు. పరశ్శతకం పూర్తి చేసాను కాబట్టి నేనిక పద్య కవిని అని హఠం చేయలేదు సరికదా మనల్ని చేయనివ్వకుండా "శఠగోపంతో" పీటముడి బిగించారు. స్వస్వరూప జ్ఞానాన్ని వెల్లడించారు. ఛాందసాన్ని పూర్తిగా వదుల్చుకోలేదు గాని వదులుగా ఉంచుకున్నానన్నారు. అక్షరాల నూట యాభై మూడు ఆటవెలదులను "మాట వెలదులు" పేరుతో ఉగ్గబట్టుకుని రచించి హమ్మయ్య ముగించాను అని తేలిగ్గా నిట్టూర్చారు. "మంగళం పాఠకేంద్రాయ మహనీయ గుణాత్మనే" అంటూ తాంబూలాలు ఇచ్చేసారు. 'ఇక "ఆడి"పోసుకోవడం మీ వంతు' అని తేల్చారు. శఠగోపం పెట్టాక సంభావన తప్పదుగా మరి! అందుకే ఈ ప్రయత్నం.

పద్యం అంటే నాకెంత ఇదైనా రాయడం జోలికి పోని నన్ను ఈ శతకానికి ముందు మాట రాయమనటం ముందు ఆశ్చర్యం కలిగించింది. "సందె పొద్దు లెగిచి సన్నీట తానించి సద్దికూడు మెక్కి సక్కనుండ్రి

నాగరికము బలిసి రోగాల పాల్జేసె" (పద్య సంఖ్య 5) చదువగానే – అవును నేనే రైతని ధైర్యం వచ్చింది. పూర్తిగా చదవాలనిపించింది. ముందుమాటలో ముందుగా చెప్పవలసిన పచ్చినిజం ఏమంటే – ఇదంతా కవిత్వం అన్న భ్రమ ఆయనకు బొత్తిగా లేదు. ఈ విషయంలో మనమూ పొరబడే పనిలేదు. అందుకే ముందు మాట రాయడం నాకూ సులువుగానే తోచింది. అయినా ఇంగువ కట్టిన గుడ్డ కదా! అందుకే ఆయన ఎంత వద్దనుకున్నా అక్కడక్కడ కవి కన్నుగప్పి కవిత్వం చొరబడింది. ఎంతలేదన్నా అనుభవమనే దొకటుందిగా! అది మల్లెపొదపై ఆరబెట్టిన పట్టుబట్ట లాంటిది. దులపగానే పరిమళం గుప్పుమంటుంది. తప్పదు. "బయట పాము జూడ భయమంది బేజారు, ఒంటిలోన యొకటి ఒదిగి యుండె, దాని లేప నీకు తరమైన భవమాఱు" (40) పద్యంలో కవిత్వం లేదనటానికి మనకు మనసొప్పదు. "అత్తకు తన కొడుకు నాడింప నిచ్చును, అత్త కొడుకుఁ దాను నాడు కొనును, అత్త ఇంటి కోడలుత్తమురాలోయి" (68) తీర్మానం వినేసరికి మనం ఒక్క క్షణం ఆగక తప్పదు. "ముందు తోకకు అగ్గి ముట్టించటం గదా హనుమ లంకను కాల్చను అసలు కతము" (89) అని కవి చెబుతుంటే కాదనటానికి కారణం తోచదు. వందో పద్యం అలాంటిదే.

"ఆచరింపలేని అసమర్థునకు ఏల గీత చంకలోన! మోత బరువు"..(15) దాకా ఏ కవైనా చెబుతాడు. సుమతి శతకమేదొ చూచుకో మనడం మాత్రం అనుభవజ్ఞుడికే చెల్లు. అలాగే నాకు బాగా నచ్చిన పద్యమైతే తొంభయ్యవది. ఈ మాట చదవగానే వెంటనే మీరు 90 దాక వెళ్ళిపోకండి. ఒకటి నుంచీ చదవండి. విపులాచ పృథ్వీ.. కదా!

నాకు కూడా అర్థమయ్యేంత తేలికగా మంచి పద్యాలు రచించిన 'కవితా' ప్రసాద్ గారికి మనసారా శుభాకాంక్షలు, నమస్సులూను. స్వస్తి.

రాజమహేంద్రవరము - **ఎర్రాప్రగడ రామకృష్ణ**

06.02.2021



## శ్రీ మండలి బుద్ధ ప్రసాద్

పూర్వ మంత్రివర్యులు,
పూర్వ ఉపశాసనసభాపతి (ఆంధ్రప్రదేశ్)

# కవితా ప్రసాదం

**ఇం**టి పేరు లోనే కవిత్వాన్ని నింపుకున్న కవితా ప్రసాద్ గారు సార్థక గృహ నామధేయులు. ఆటవెలదుల్ని మాట వెలదులుగా మార్చినా ఛందో జ్ఞానం కలిగిన కవితా ప్రసాద్ గారి మనసు ఆటవెలదుల్ని వదిలి పెట్టలేకపోయింది. కాకపోతే ఈ శతకం మాటలు నేర్చిన ఆటవెలది. ఎంత మాటలు నేర్చిందంటే ఆసాంతం చదివించే నేర్పు దానిలో ఇమిడి ఉంది.

వీరు వేంకటేశ్వర ద్విశతి, శ్రీ రాజశేఖర శతకం వంటి శతకాలు వ్రాసియున్నారు. కవితా ప్రసాద్ గారు నాకు పరిచయస్తులో.. కాదో.. తెలియదు. గుర్తు లేదు. కాని వారి తండ్రి గారు తెలుసు. వారు గొప్ప జ్యోతిష శాస్త్ర వేత్తలు. కానీ ఆ మాట వెలదులను చదువుతూ ఉంటే వారు నాకు బాగా సుపరిచితులు అనిపిస్తుంది. అది వారు రాసిన కవిత్వపు పోకడలోని గొప్పతనం. ఇద్దరు మిత్రులు సరదాగా చలోక్తులతో, చమత్కారాలతో, వ్యంగ్యాస్త్రాలతో మాట్లాడుకున్నట్టు, సంభాషిస్తున్నట్టు,

"(హమ్మయ్య! ఐపోయినాయండీ!)
మంగళమ్ పాఠకేన్ద్రాయమహనీయ గుణాత్మనే!" అని ముగించటం, మంచి రస స్ఫోరకంగావుంది. వీరు మంచి రస హృదయులు. వీరిది అవనిగడ్డ. అవనిగడ్డలో ఇప్పటికి కవితా వారు సిద్ధాంతులు ఉన్నారు. దివిసీమ నుంచి తెలుగు సాహిత్యానికి విశేష సేవలు చేసిన మహనీయులు

ఎందరో ఉన్నారు ఈ దివ్య సీమ మాహాత్మ్యమో, కృష్ణవేణమ్మ తల్లి మాహాత్మ్యమో తెలియదు గానీ ఈ గడ్డపైన పుట్టి ఇతరత్రా వెళ్ళిపోయి సాహితీ సేద్యం చేస్తున్న ఇటువంటి కవితా మూర్తులకు శతధా వందనాలు. కృష్ణాతీరంలో కృష్ణా నదీ పీయూషమును గ్రోలి ఇక్కడి లేజిగురును మెసవిన కృష్ణాకోయిల గౌతమీ తీరంలో కలరవములను వినిపిస్తూండటం చాలా ఆనందం. పద్య కవిత్వానికి, శతక కవిత్వానికి, భావకవిత్వానికి ఇంకా అనేక రకాల ప్రక్రియలకు, సంగీతానికి పురుడు పోసుకున్నది ఈనేల. ఈ నేలపై జన్మించిన కవితా ప్రసాద్ గారు కొలువు విడుపు అనంతరం మళ్లీ కలం పట్టుకున్నారంటే వారిలో నిబిడీకృతంగా దాగి ఉన్న కవితా సరస్వతి ఊరుకోనిస్తుందా! మంచి పూనకం పూనేటట్లుగా చేసింది. ఇక చూడండి వారి కలం నుండి పుంఖానుపుంఖంగా కావ్యాలు ఎలా వెలువడతాయో..!

ఈ శతకంలోని ప్రతి మాట వెలది అనర్ఘ రత్నమే. వీరు దివిసీమ కవితా రత్నమే. ఇక చదవండి. మంచి ఆలోచన, 100 ప్రతులు మాత్రమే వేశారు. అందరూ అంతర్జాలంలో చదివే వెసులుబాటు వచ్చింది కదా అందుకే అనుకుంటాను. ధన్యవాదములతో.

మీ

అవనిగడ్డ - **మండలి బుద్ధ ప్రసాద్**

10.07.2021

# శరగోపం

**ము**నుకడ అడిగినదే తడవుగా ఒడబడి కడిది యనుగు గడబిడ లేని మున్నుడి నాడిన గామిడి అక్కర అరకాడు ఎల్బాప్రగడ రామకృష్ణ గారికి  నూటారు మేలు ఒడికపు టల్లోనేరేళ్ళు. వారు 20000 కు పైగా వివిధ విషయాల గుఱించి రచనలు చేసి, ఇంకా చేస్తున్న సాహితీ వ్యాసంగులు. ప్రాసంగికులు. ప్రముఖ దినపత్రిక ఈనాడు లో వారి ఆదివారం సంపాదకీయాలు, అంతర్యామి శీర్షికలో వ్యాసపరంపరలు పాఠకలోక ప్రియ ప్రసిద్ధాలు. శ్రీ రామకృష్ణ గారికి ధన్యవాద సహస్రములను సమర్పిస్తున్నాను.

పూర్వ మంత్రివర్యులు, పూర్వ ఉపశాసనసభాపతి (ఆంధ్రప్రదేశ్) గౌ. శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారి తెలుగు భాషాత్యభిమానము మరియు తెలుగు భాషాభివృద్ధికై వారు నిరంతరం పాటుపడుతూ చేస్తున్న సేవ దేశవిదేశాలలో ఉన్న తెలుగువారందరికీ విదితమే. నేను పంపిన DTP ప్రతిని ఆసాంతము చదివి వారు తమ ఆత్మీయమైన అభిప్రాయాన్ని అందించారు. వారి సౌజన్యతకు మనఃపూర్వకముగా వందనశతము నర్పిస్తున్నాను.

తరువాయి నా నుడి ఏమనగా..

నేను మా ఊరు అవనిగడ్డ లో ఇంటర్ ఫస్టియర్ చదివేటప్పుడు “కవి ప్రసాదు వాక్కు కల్ల యగునె” అనే మకుట పాదంతో కొన్ని ఆటవెలదులను పదో మరో పదో వ్రాసాను. అన్నీ ఇంగ్లీషు పీరియడ్లోనే. చదివినవాళ్ళు బాగు బాగు ఒక శతకం చేయి అన్నారు నా ముఖం మీద. అంటారు గదా! వెనకాల ఏమనుకున్నారో నాకు తెలియదు కాని అది జరుగకూడని పనేమో అన్నట్లు జరుగలేదు. ఆ పద్యాలూ గుర్తు లేవు. ఈ మధ్య కాలంలో

వృత్తివిరమణ చేసిన తర్వాత పాత కాగితాలలో ఆ మకుటం కన్పించి అఁ! ఇప్పుడు చేద్దాం అనిపించి మకుటానికి మరమ్మత్తు చేసి (ఆ మకుటం అచ్చిరాలేదేమోనని) ఇదిగో ఇలా పూర్తి చేసాను. అంతమాత్రాన ఇదేదో తెలుగు పలుకమ్మకు తలకట్టవుతుందని కాదు.

సరదాగా చదువుకోవటానికే .. వినియోగః తప్ప దీనికి సద్యః ప్రయోజనం కాని, ఆలస్య ప్రయోజనం గాని ఏమీ లేదు. ఏ కవికైనా వ్రాసిన తర్వాత దానిని చదివించో వినిపించో బలవంతంగానైనా బాగుందనిపించుకోవాలనే ఓ సరదా దురద ఉంటుంది కదా! అందుకని మీకిలా ఓ అవకాశం ఇస్తున్నాను ఉచితంగానే, "కొని"యాడరేమోనని. చదివి నా కోరికను తీర్చేస్తే పోలా మఱి. అదే నా ఈ పరశ్శతకానికి మీరిచ్చే రస(జ్ఞ)పతకం. నేను ఉంటాను. మీరు ముందుకు సాగి చదివే సాహసం చేసేయండిక. ఇలాంటి సాహసాలు ఇంతకు ముందు చేసి ఉన్న అనుభవజ్ఞులే కదా! మఱేమో అక్కడక్కడా భాషా నియమాలకు సంకెలలను వదిలించలేదు గాని వదులు చేసాను ఇచ్చాను సారంగానే. కొంచెం ఉదారంగా ఉండాలి బాబూ మీరూ మఱి!

రాజమహేంద్రవరము — **కవితా ప్రసాద్**

ప్లవ ఉగాది, 13-04-2021

# మాట వెలదులు

## (పరశ్శతకము)

ప్రొద్దు తిరుగుడు పువు రూపు సక్కనె కాని
సౌరభము లొలుకునె జాజి చూడ్కి
చేవియ లేని పద్య కవితయు నట్టులె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 1

క్షారవనధిఁ జొచ్చి క్షీరతుల్యనదులు
సారమెల్లఁ జెచ్చి సమసిపోవు
చెడ్డ సంగడమ్ము చేటె చేకూర్చురా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 2

బాట యొకటి కలదు వాడుదు రఊుదుగ!
పోవ దాని వెంటఁ జేవ వలయు!
దాని పేరుఁ దెలియుఁగా నిజాయతి యంద్రు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 3

నిల్ప మంత్ర బలము శిల్పమౌఁ గద వేల్పు!
చిన్న బిడ్డ లనెడి శిల్పములకు
మంచి బుద్ధి నేర్ప మాన్యు లౌదురటులె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 4

సందెపొద్దు లెగిచి సన్నీట తానించి
సద్దికూడు మెక్కి సక్కనుండ్రి!
నాగరికము బలిసి రోగాల పాల్సేసె
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 5

కుక్కను లఘుశంక కూర్చొని చేయన
కాలు లేపకున్నొ యాలకించి?
జీన్సు మహిమర యది జీవితాంతమునుండు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 6

ఆత్మ ఆత్మ యంచు హైరాన పడనేల?
ఉన్న నుండు లేక యుండ దున్న
సాటిజీవి కింత సాయమ్ము సేయవో
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 7

పడతి పసిడుల కయి పర్వెత్తి పర్వెత్తి
మాయ ముగ్గి జనుల మచ్చేమాసె !
పసిడి యెదద పడతి భార్యైన చాలదో!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 8

సౌరభమ్మె "మాట" సంపంగి పూవుకు!
సుమగులాబి "మాట" సొగసు చెలువు!
మంచి మనసె మనిషి "మాట" కావలయురా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 9

పుట్టినప్పు డేడ్చుఁ బూర్వజన్మఁ దలఁచి
తప్పులింకఁ జేయ నొప్పనంచు!
పెద్దయౌచు మఱచుఁ బెనుమాయ క్రమ్మగ!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 10

ఊరుఁ బేరు లేక యూరకే కూర్చున్న
పక్కవాని గిల్ల తిక్క పుట్టు!
ఐడిలు మనిషి బ్రెయినౌ డెవిల్ వర్క్ షాప్ట!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 11

మనువు చెప్పెఁ గాన మంచి కాదందువో?
సొమ్ము తెచ్చి గృహిణి కిమ్మనెఁ గద!
దన్ను నిలువ మనఁగఁ దరుణికిఁ దప్పొర!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 12

తేనె మాటలాఁడి మానమ్ము దోస్తారు!
పాత పాట యంచుఁ బట్టి వినక
వంచితులయి నాక వలవలేడుస్తారు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 13

పోరుఁ జేయనంచు భోరుమన నరుఁడు
గీత జెప్పి నిల్పె గృష్ణు డనిని!
బ్రతుకు పోరు గెల్చు బ్రహ్మాస్త్ర మదియేర!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 14

ఆచరింపలేని యసమర్థునకు నేల
గీత చేంక లోన ! మోత బరువు!
సుమతి శతక మేదొ చూచుకో చాలదా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 15

మంచి రోజు వెదకె మనువాఁడఁగా నాఁడు!
మంటపమ్ము చిక్క మనువు నేఁడు!
పాణి గ్రహణ మౌను పంచే దొరికినప్డె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 16

మనుగుడుపు లయినను మామిల్లు వదలరు!
హవ్వ! నేటి కైన హరుడు హరియు !
పుట్టినిల్లు లేక పొత్తుగుడుపులాయె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 17

జున్ను పాలు వదలి మన్ను కొఱికె కన్న
డవని కాంత యన్న నంత ముద్దొ!
ప్రేమ యెంత యేని పెండ్లాముఁ గొఱుకునా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 18

మాయలాడి సీత మాయలేడినిఁ దేఁగ
మాయరూపుఁ బంపె మంకు పట్టి!
మాయ గాణ్ణనుకొని మాసె రావణ శుంఠ!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 19

హరికి మేని క్రింద గరుడారి పడకయ్యె
హరునకు మెడ చేుట్టు హారమయ్యె
కుండలియయి లోన గూఢమై మనకుండె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 20

పాలకడలి మధ్య పడకవేసె నొకఁడు!
మంచుకొండ నొకఁడు మఠము వెట్టె!
కళ్ళు మూసి ప్రొద్దు గడిపెడు దేవుళ్ళు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 21

రోడ్డు మీద రోజు నడ్డదిడ్డము తిర్గి
వాన నాఁడు బండ్లు మేనిఁ దడుప
పుట్టుపాతు విలువ గట్టిగాఁ దెలియుర!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 22

మొదటి యచ్చు తో నయిదవ హల్వర్గుది
చివరి యక్షరమ్ము చేర ద్విత్వ
మై యమృతము!యదె తురీయాద్యము విషము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 23

మొదట బంధ మొక్క మొక్కవంటిది సుమ్ము
ప్రేమ నీరమిడుచుఁ బెంచే దానిఁ
బెరిగి దన్ను నిచ్చు వేల్పు చెట్టుపగిది
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 24

సున్నయే కద యని చిన్నచూపు వలదు!
అంకె ప్రక్కఁ జేర్ప నతిశయించు!
ప్రకృతి లోన లేదు పనికిమాలిన దేది
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 25

కాసు లున్ననాఁడు పూసుకఁ జేత్తురు!
ఉన్న దూఁడి నప్పు దూసదుఁగరు!
చీకటందుఁ జెంతఁ జేరదు చాయైన!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 26

వచ్చి రాగ తెలివి పచ్చి బాలింతయు
చేతఁ దడుము కొనును సెల్లు కొఱకు!
ఏడ్చును గసుగందు నేది మొబైలంచు
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 27

తీపి పల్కు లాఁడి తేనెలఁ జిందింత్రు!
ముఖము పైన నవ్వుఁ బూసికొంద్రు!
తలలు తెలుపులైనఁ దలఁపులు నలుపేను!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 28

నూనె చక్కె రుప్పు లేనట్టి పిండమ్ము
నేడ్చుకొంచుఁ దినుచు నేల బ్రతుక?
కాయకష్ట మున్న కలుగునే ఆ బాధ!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 29

స్వాంతమందు లేక సంస్కార మావంత
మదిని నాఁటుకొనునొ మంచిఁ జెప్ప
మెత్తబడునె రాయి యెత్తి పాలను ముంచే
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 30

సతికి పతికి నీఁద సంసార జలధిని
చేదువు సంధ్యలైనఁ జాకిరైన
నిష్టపడఁగఁ జేయఁ గష్టమేముండురా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 31

పైకిఁ ద్రోయు నిన్నుఁ! బడఁగొట్టుఁ గ్రిందకు!
కర్మ ఖర్మలందు మర్మమెఱుఁగఁ
బూర్వజన్మ నాటి పుణ్య పాపఫలము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 32

వేష భూషణాల విరివిగా ధరియించి
పట్టుబట్టఁ గట్టి పెట్టి భూతి
వెడలు ప్రవచనమిడ వేదాంత సమ్రాట్లు
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 33

తినదు చెట్టు కాయు తీపి పండ్లను దాను!
త్రావదు కరిమబ్బు తనదు నీరు!
నడువ వలదె ప్రకృతి నుడువు నీతిపథాన!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 34

రాయి తగిలి కాలు గాయపడె ననుచు
రాయి పైన నింద వేయనేల?
కదల లేని రాయి కాలినెట్లు గఱచె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 35

మాజికులను జేయు మాయబాబాలపై
మోజుఁ బెంచు కొంచు మోసపోవు!
లాజికుగను దలుప లక్ష్య పెట్టరు గదా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 36

గీత గొప్పదంచు గీపెట్టు నొక్కఁడు!
మా ఖురానె సర్వ మను మరొకఁడు!
వాదులాఁడు గాని వారు చేదివిరేది?
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 37

సెల్లుఫోను పైన స్క్రీను గార్డును వేయు!
పెట్టడు తల పైన బ్రెయిను గార్డు!
ఇంటివారిఁ దలచి హెల్మెట్టుఁ బెట్టవో!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 38

బ్రాహ్మణుండు సంధ్య వార్చవచ్చుఁ గలిని!
బట్టతలను జుట్టు పుట్టవచ్చు!
రంకులేక నేడు రాజకీయంబెట్లు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ ! 39

బయటఁ బాముఁ జూడ భయమంది బేజారు!
ఒంటిలోన నొకటి యొదిగి యుండె!
దాని లేప నీకుఁ దరమైన భవమాఱు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 40

కుక్కరిస్తమంటె, చేక్కగ లిక్కరు
పోస్తమంటె వోటు వేస్తివొ! యిపు
డున్న నిక్కరైన నుండబోదు నిజేము
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 41

మంచివాని పొందు మధురేక్షుదండంబు!
పరిపరి నమిలినను నెరయుఁ దీపి!
చెడ్డవాని చెలిమి చేఁదుదోస పగిది!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 42

ఎలుక వలనఁ గూడ యేను గదరవచ్చు
దూరి సందడింప తొండమందు!
ఆటలాఁడు నల్పుఁ డరయ నాయువుపట్టు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 43

ఇంట వంట నేఁడు గుంటువడియెఁ గాదె
పండుగైన! రోజువారి కైన!
పుట్టుపాతు లయ్యో పుడ్డు పాతులిలను
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 44

వండుకున్న యమ్మ కుండునొక్కటె కూర!
అడిగి కొనఁగఁ గూర లారు వాన్కి!
కావలసిన నెన్ని కఁరిపాయింటులో!!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 45

ఆలి చేతి కీయ నధికార మింటను
వలపు మిక్కిలంచుఁ దలఁప రాదు
భయము చేత నగును వాయికి జేడిసియు
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 46

వయసుతోడ రాదు వార్ధక్య మేనాఁడు!
మనసులోని తలఁపు మహిమ కాని!
వీడకున్నఁ బనిని వృద్ధతే దరిరాదు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 47

పూల సౌరభమ్ము గాలివాటునఁ బోవు
సహృదయ సుమగంధ మహరహమ్ము
దిక్కులన్ని నిండి దివ్యమై దీపించు
కవి ప్రసాదు మాట కాస్తవినవొ! 48

గుడికిఁ బోవుఁ గాని చెడు చేటు భావాలు
వదలకుండ మదిని మెదలుచుండు!
అమ్మవారలేర అమ్మాయిలందరు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 49

మట్టికుండ సొట్ట మాటు వేయఁగఁ బూనఁ
బెంకులవును గాని వంక పోదు!
చెడ్డవాని బుద్ధిఁ జెఱుప నట్లేనురా!
కవి ప్రసాదు వాక్కు కాస్త వినవొ! 50

నీటి చుక్క విలువ కోటి కోటుల మించు
కంటిదైన మఱియు మింటిదైన!
నెలత దైనఁ గలత! నింగిదైన ఫలద!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 51

డబ్బు మూట మోయ డజను మంది జనులు
చేతి క్రింద నుంద్రు జీతగాండ్రు
పాడె నెత్తు నాఁడు రాడొక్కఁ డైనను
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 52

పొగడిక తెగడికల పుచ్చుకొనుము రెంటి,
వాన యెండ  రెండు వలయు, మొక్క
పెరుగ వలయు నన్న  వృక్షమై పుడమిని!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 53

ఖలుని తోడ ననుఁగు కాలు కట్టె తెఱఁగు
చేరి దానిఁ బట్ట చేతిఁ గాల్చు!
నాటి యున్నదైన నంటించు మసి నీకు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 54

చూడఁ జెక్కనుండు వాఁడు స్ఫురద్రూపి!
వాగినాక తెలియు వాని తాపి!
వ్యక్తి చెక్కఁదనము బాహ్యాంతరవ్యాపి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 55

బుగ్గ పైన నొకటి పొట్టపైన నొకటి
సుదులఁ జూడ నీకు గడబిడేల?
సుడులు గావురయ్య సుడిగుండము లెఱుఁగ
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 56

అడుగకుండఁ గురియు నాకాశ మేఘమ్ము
అడుగకుండఁ గాయుఁ బుడమిఁ జెట్టు
అడుగకుండ నిడు సహాయము సుమనస్వి
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 57

జారి పడుట యన్న నేరమేమియుఁ గాదు
క్రిందఁ బడినవాఁడు లేవ వలయుఁ
బడిన లేవ కున్న పనికి మాలినవాఁడె
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 58

పండు రసము నీయ పిండఁగా వలయును
అత్తరీయ పూల నదుమ వలయు
బ్రతుకు సార మరయ బాధ లొందవలయు
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 59

సత్యమాడువాఁడు నిత్య మొంటరివాఁడు
చేవు పిమ్మ టతని దేవుఁడంద్రు
దైవ మౌను గాని తప్ప దొంటితనము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 60

తనదు గుడ్లఁ బొదుగు కొనఁ దన చేఁగాదు
కొమ్మనెక్కి కూయుఁ గమ్మఁ బికము
పోటుగాఁడు వాగఁ, గేటుగాఁడు పనికి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 61

"రా" యనంగఁ బెదవులఁ దెఱచి యఘములు
బయట కూఁకు! మూయ "మ" యని తిరిగి
రావు! "భామ" యనిన రాదొకో ఫలమట్లె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 62

పుట్టి నపుడు నీవు పూయు నగవులింట
గిట్టి నపుడు నవ్వ పుట్టకుండ
మధ్య బ్రతుకు నెల్ల మంచిగా నడపుము
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 63

అరయ "దేహ" మగును నజ్ఞాని మంత్రము!
కనగ "సోహ" మగును జ్ఞాని మంత్ర!
మెఱుక లేని వాని కెన్నిజన్మలవునొ!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 64

నీరు పెట్ట మొక్క నిలిచి వృక్షమగును
నీరు తగుల నినుము నెగడుఁ ద్రుప్పు
మంచిదౌపలుకు రుచించే దెల్లరకును
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 65

గంగ నెట్లు పూనె మంగళమ్మంతగ
శ్రీశు పదము శివుని సిగల వలన
సజ్జన నఖ కేశ సంస్పర్శయు శుభమె
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 66

కాలము మనదైన కావరమ్మగు మెండు!
ఎండ కందు వందు మండె డినుఁడు
శీతకాల మందు చెండాడఁ గలఁడొకో!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 67

అత్తకుఁ దన కొడుకు నాడింప నిచ్చును!
అత్త కొడుకుఁ దాను నాడుకొనును!
అత్త ఇంటి కోడ లుత్తము రాలోయి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 68

కుండి లోని మొక్క కుదురుగాఁ బెరుఁగును!
అదుపు లేక పెరుఁగు నడవి మొక్క!
పెంపకమ్ము నేర్పుఁ బెరుఁగు విధానము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 69

నీరు వోసి ముంచే నూరు కడవలతో
మొక్క కుళ్ళి చేచ్చి పోవు గాద!
అవసరమ్ము తీరు నంతె బిడ్డలకిమ్ము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 70

తాడి చెట్టు తాను నీడనీయఁగలదె
మఱ్ఱి చెట్టు మాద్రి మానవులకు!
చిన్న యైన నేమి మిన్న యెడఁదయున్న!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 71

తట్టి లేపు నమ్మ! మొట్టి లేపును భామ!
కుట్టి లేపు దోమ! పట్టి చూడ
నెవరి శైలి వారిదే! లేవఁ దప్పదే!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 72

ఓనమాల నుంచె ఒంటఁ బట్టించేఁగ
రాత మార్చు కొనును గీత చదివి!
షష్టి పూర్తి కాన్కఁ జేదువఁగ ఫలమేమి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 73

పృథివి నుండదయ్య మృగతృష్ణలో నీరు
దాన తీరఁ బోదు దాహమేమి!
పృథివి పుత్రియుఁ బడె మృగతృష్ణతో గాసి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 74

పస్తులుండి మనుజుఁ డాస్తుల నెన్నియో
కూడఁ బెట్టి తనదు కొడుకు కీయు!
నెక్కువెంత యిడిన నేయు పిండమొకటే!
కవి ప్రసాదు మాట కాస్తవినవా! 75

పప్పు వ్యంజనముల నుప్పు రుచిపరచు!
పాలు పాకములను బంచేదార!
మనుజు లందెవరి సమర్ధత వారిదె!
కవి ప్రసాదు మాట కాస్త వినవా! 76

ఉన్న దారిఁ బోవ నొకఁడవు మందిలోఁ!
గ్రొత్త దారి వైచి సత్తుఁ జూప
మంది కెల్ల నీవు ముందునం దుందువు!
కవి ప్రసాదు మాట కాస్త వినవా! 77

నీదు చేఁత లొకని మోద హేతువు గాఁగ
యోగ్య మంతకంటె భాగ్యమేమి!
బ్రతుక వలయు నట్టి పరమార్థదృష్టిని
కవి ప్రసాదు మాట కాస్త వినవా! 78

నమ్మకమ్ము పుట్ట నాళ్ళునాళ్ళు వలయు
పట్టదు క్షణమైన వమ్ము గాఁగ!
ఏళ్ళ నాటి చెట్టు వేళ్ళు నరికినట్లు!
కవి ప్రసాదు మాట కాస్త వినవా! 79

ఆర్జితమ్ముఁ జూచి యానంద పడనేల
వ్యయముఁ గూర్చి చింత వలయు నీకు!
ఆర్జితమ్ము మించు వ్యయమనర్థకరము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 80

సింహమైన నేమి చిక్కి శల్యము గాఁగ
బక్క కుక్క కూడ బాధ పెట్టు!
బలిమి లేని నాడు తలుపకు నీగొప్ప
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 81

ముందు పలుకరింప మూటేమి పోదుగా
నవ్వు మొగము తోడ నరుఁడ నీవు!
రాముఁడట్లె సేసి ప్రజలకుఁ బ్రియుఁడాయె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 82

అంబుద మ్మురుమఁగ నాడు మయూరము
ప్రథమ ఋతువునందుఁ బాడుఁ బికము
కనెడు వినెడు వాని గుణభేద మెంచునో
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 83

ఎఱుకఁ బడయవచ్చు నెవరి వలననైన
పాఠమైనను గుణ పాఠమైన!
నేర్చుకొనఁగ దొరకు నీకేదొ యొక్కటి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 84

సొంత చింతఁ బాయు తంతు నెఱుఁగఁబోడు
పరుల వంతలందు ప్రజ్ఞఁ జూపుఁ!
దనది కాకయున్న మొనగాఁడె ప్రతివాఁడు
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 85

క్రింద పడిన దెబ్బ మందుతోఁ బోవును
కాని జ్ఞానమొకటి కలుగు నిజము!
గేలి సేయు నెవఁడొ! కేలు నిచ్చు నెవఁడొ!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 86

కష్టమేదొ కలుగ కన్నీటఁ దొలగునా!
బేలతనము తోడ మూలఁ బడక
అధిగ మించు తెన్ను నాలోచనను జేయి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 87

రుచికరమగు వంట లొట్టవేసుక తిను
నోరు పల్కుఁ దగునొ కారు కూత!
లరయ మాట లట్టుల రుచిగ నాడుము
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 88

ముందు తోక కగ్గి ముట్టించుటం గదా!
హనుమ లంకఁ గాల్చ నసలు గతము
మూల విషయ మరయఁ బోవరు తప్పెన్న!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 89

రెండె కన్నులుండ రెచ్చిపోయె నగారి!
ఒడలి నిండ యున్న నూర కున్నె!
పొలము మన్కికింత తెలియకఁ బోయెనే!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 90

పైన నొక్కడుండు పరమాత్ముఁ డనువాఁడు
చేతలు సెడులైన వాఁతఁ బెట్టు
ప్లీడరులకుఁ జోటుఁ బెట్టని సమవర్తి
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 91

నిప్పు లేని పొగయు, నీరదమే లేని
వాన జల్లు, వెలుగు లేని నీడ,
దొసవు లేని నరుడు, పొసఁగ నుండునెటుల?
కవి ప్రసాదు వాక్కు కాస్త వినవొ! 92

ఆయువిచ్చె కృష్ణు డస్త్ర హతుఁడు గాక!
ఐన దుర్మతి దురహంబు హెచ్చె
తనదు చేవు దాన కొనియె పరీక్షిత్తు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 93

మాట చెల్ల నపుడు మౌనము వహించప
కలహ మేర్పడుటిక కల్ల గాదె!
చిరునగవును బూన చెదరు సమస్యలు
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 94

నీడ తప్పు యెవరు నీయున్కి గణియింత్రు
జనుల కేమి పట్టె జగతియందు!
నీదు పనిని నీవు నిర్వహించు కొనుము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 95

డబ్బు పెరుగ డాబు డంబాలతోఁ బాటు
దాన ధర్మములిడు స్థాయి పెంచు!
దీనబంధు వైన దేవుఁడు మెచ్చును!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 96

తిన్న దరిగిపోవుఁ దిట్టు మిగిలిపోవు
పలుక కూడ దెపుడు ములుకు మాట!
మాట మంచిదైన మహియెల్ల లోబడు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 97

పాంటు షర్టు వేసి పాఠాలు సెప్పెడు
తెలుగు మాష్టరనును! వలదు వాడ
నాంధ్ర పద్యమందు నన్యదేశ్యపదము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 98

వాననిచ్చు మబ్బు తాను కరిగిపోయి!
సజ్జనులు వెరువరు చావు కట్టె
లోకమునకు మేలు చేకూర్చు పనియందు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 99

గరళము నెవరు రుచి గాంచిరి చేదన!
నమృతమెవరు ద్రావిరి మధురమన!
లోకులాడు మాటలు నటులె యుండును!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 100

గంగలోన ముంచే గన్నేరు పప్పును
విషము విరిగి తినఁగ వేడుకౌనొ!
మనసు శుద్ధి లేని మానవుడంతెగా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 101

ఒక్కొక మెతు కీవు మెక్కుదాని కొఱకు
నెందరి చెమటెంత చిందె నంచుఁ
దలుప నొక్క మాఱు తెలియు దాని విలువ!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 102

తాత కూడఁబెట్టు తండ్రి నిలువఁబెట్టు
కొడుకు పుట్టఁగానె కోటికిఁ బతి!
తేనెటీఁగ శ్రమను మానవుడందడో!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 103

భయము లేదు చేంపఁ బట్టు పురుగులన్న
తేనెటీఁగ లన్న ప్రాణభయము!
ముల్లు కర్ర యున్న ముల్లోకము లడలు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 104

ఆర్థికమ్ము దీర నయ్యతోఁ బని యేమి?
ఆలి వచ్చినాక అమ్మ యెవరు?
అవసరాల కొరకె అన్ని బంధమ్ములు
కవిప్రసాదు మాట కాస్త వినవొ! 105

చింత కాయ రోగ చింతను దీర్చును!
ఉసిరి కాయఁ దినగ నుసురు నిల్చు!
ఊరుగాయలఁ దిని నూరేళ్ళు బ్రతికిరి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 106

కలలఁ గనుట సులువె! కాగ సాకారము
వడయ కాదవెల్ల వాస్తవాన!
కాని గొప్పవాఁడు గాడు గనక కలల్!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 107

ద్వారము కుఱచైన దూరమో తలవంచి!
అనువు గాని చోట నహము వీడి
పనిని పూర్తిచేసికొనెడి వాడె వివేకి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 108

మత్త గజమునైన మశకము పీడించు
సిలుగు పెట్టు నీగ సింగమైన
అధికులకటు తప్పదల్పుల యారడి
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 109

పక్షి రెట్ట వేయ వ్యర్థమౌను గడలిఁ
బొలము లందుఁ బడిన మొక్కలెదుగు!
చేయు పనికి లబ్ధి చేకూర వలయుఁగ
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 110

ఒరుల కన్నులు మనకొరకు నీరొలుకంగఁ
గోరి శుభము మనకుఁ గుశల మౌను!
కాని కార్ప రాదు కన్నీరు మనచేష్ట!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 111

భార్య (భర్త) బిడ్డ లంచుఁ బవలు రేలు శ్రమించి
ఉన్న దంత వారి కూడ్చిపెట్ట!
అంత్యమున గెలతెగినట్టి యరఁటివౌదు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 112

చెట్టు మొదలు సేరి సేద తీర్చుకొనియుఁ
గొట్టుదురుగ కలప కోసమంచు!
చేరఁ దీయ జనులఁ జేటుకూర్తు రటులె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 113

క్రుంగి పోక పూయుఁ గ్రొత్తగ వృక్షమ్ము
పూచి నట్టి విరులు పోవ రాలి
నష్టమైనదాని నరుడ! పడయుమట్లె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 114

ఉల్లి పొరలఁ బోలు కల్ల వావులవేల
కంట నీరు వెట్ట మంట పుట్టి!
ఊడి పోవుటె యవి యుత్తమంబౌ సుమ్ము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 115

పాడుకాకి నైన పాడు పికము నైన
సాక రింటఁ గోరి జనులెవరును!
రంగువన్నె యంచు రాచిలుకనె పెంత్రు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 116

అధిక దూరమైన నతిగ దగ్గరయైన
బంధ పాలనమ్ము బరువె యగును!
తలచినంత చేరు దవ్వ శ్రేయము సుమ్ము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 117

లవణ దేహుఁడని వలచేకుండునొ నదులు!
మురికివి వలదని సముద్రుఁడనునొ!
తప్పులెన్న మాన దంపతుల్ సుఖముంద్రు
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 118

కారు నడుప వలయు గేరు దారి కనువుఁ
బడవ తెడ్డు వరద వాలు కనువు!
బ్రతుకు బండి నడుపు ప్రాజ్ఞత నట్టులె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 119

పెండ్లి కాక మునుపు పేరు దాశరథిట!
పెండ్లి కాగ సీత పెనిమిటి యట!
మగనికెన్న సొంత మనుగడయే లేదె!
కవిప్రసాదు మాట కాస్త వినవొ! 120

కలుగఁగఁ దనకు సిరి  కష్టానికి ఫలము!
ఎదిరి వాని సిరి యదృష్ట వశము!
కలిమి పొందఁ గోర కావలయును రెండు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 121

తెల్ల కాగితమ్ము తేలిక పాటిదే!
గ్రంథ రూపమందుఁ గరపు బుద్ధి!
నోటు రూపమంద నుతిఁగొను లక్ష్మిగ!
కవిప్రసాదు మాట కాస్త వినవొ! 122

స(ప)తికి వాగుట పని ప(స)తికి వినుట పని!
అర్థ మేదొ వెదకి ఔననంగ!
పలికె కాళిదాసు "వాగర్థ" మంచిదె
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 123

ఘంటసాల గీత కమ్మగ వినిపించే
బాల్చిఁ దన్నె నెవడొ పాపమంచు
సంప్రదాయముగను జనులేమొ నిట్టూర్చు
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 124

మన్ను లేనిచోటు మహియందు నుండునో!
గాలి లేని తావు గలదె జగతి!
బాధ లేక జీవి బ్రతుకఁగ సాధ్యమె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 125

స్కూటరొక్కటున్న కుర్రకుంకకు జోస్యు
డొకఁడు సెప్పె కారు యోగ మంచు!
యాక్సిడెంటుకాఁగ టాక్సి మోసెను పాడె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 126

ఇసుక యెడరు నైన నెదుగు మొక్కలు కొన్ని!
మట్టి రేగడైన మనవు కొన్ని!
గొప్ప వంగడమని కోతలు వలదురా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 127

మరువ నిన్ను నీవు పరమగు ధ్యానము!
తెలియ నిన్ను నీవు కలుగు జ్ఞాన!
మరయ రెండు ముక్తి కమ్మనాన్నలు సుమ్ము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 128

తప్పుఁజేయ సహజ మిప్పుడమి నరుఁడు!
మంచి వాడవు సవరించు కొనఁగ!
మంకుబోతవును సమర్థించు కొనఁగను!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 129

పొడుగు కలలఁ గనుచుఁ బ్రొద్దెక్కి మేల్కొన
సిద్ధి యౌనె కోర్కి బుద్ధి హీన!
కష్టపడక నీకు కలలెట్లు నిజమౌర!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ 130

ఆలమంద యందు నంబా యనఁగ లేఁగ
గుర్తు పట్టునెట్లు గోవు మాత!
సృష్టి మర్మ మెటుల స్రష్ట కూర్చె నిటుల!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 131

భూమిలోన దూరి భోరుమనఁగవచ్చు!
ఎవ్వరెస్టు నెక్కి యేడ్వవచ్చు!
మగువ చిత్తవృత్తి మగవాని కెఱుకౌనొ!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 132

వేంకటేశ యనిన! వెంకటేశ యనిన!
భేదమేమి యెంచు వెన్నుఁ డరయ
నిర్మలంపు భక్తి నిండార మదియందు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 133

కాయ పండి యెండి కడకు రాలును గాని
విత్తు దాచు వంశ విటపి నిలువ!
అట్టి పండులె కద అమ్మ నాన్నలనిన!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 134

దైవతములఁ జూడఁ దాల్చుకొన్నారాంధ్రఁ
దనువు లందు మగలె తాము పెరిమ!
కాంతలేరు లేరు కనఁగనట్టి పగిది!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 135

ముఱికిఁ జూపె నంచు మొత్తగ నద్దము
ఫలితమేమి శుభ్రపఱచు కొనక!
లోపమేదొ చెప్పఁ గ్రోధమ్ము పడనేల!
కవి ప్రసాదు మాట కాస్తవినవొ! 136

ఎన్నొ కుట్టు కళ్ళు! నెత్తిచూపెడు వేళ్ళు
శల్యుని వలె  నోళ్ళు! చాల ముళ్ళు!
చెదరనీక దీక్ష చేరుము లక్ష్యమ్ము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 137

చిక్కు నీదె, చేక్కఁజేయు పనియు నీదె!
ప్రక్క వానికేమి పది వదరును!
ఆచరింపఁగఁ దగ దాలోచనఁ గొనక!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 138

మంచి వాని మాట కొంచెమైన వినరు
ముంచు వాఁడు సెప్ప పొంచి వింద్రు
చేదు మందు కంటెఁ జేటు కల్లే తీపి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ 139

అక్కజమగు జ్ఞాన మాకాశ మంతయౌ
నాచరణమునఁ గన మావ యంతఁ!
బనికిమాలినట్టి ప్రజ్ఞాన మేలరా!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 140

రాముఁడెంతొ గొప్ప! రమణ ఋషియు గొప్ప!
చేదువుఁ గాని వారి చరిత ఘనత!
వారి నడత సుంత పాటింప నొల్లడె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 141

తెలియుచే గతము నొక దిక్సూచి మాదిరి
జీవనమ్ము సలుప శ్రేష్ఠమగును
ఊఁతఁ జేయఁదగదు  పాతదంచుఁ బ్రతిది
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 142

మానవుండగు ప్రతివానికి దొసగుండు
నెంచే మొదలు వెట్ట కొంచెమైన!
రత్న గర్భుఁడైన లవణాకరుఁడు గాదె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 143

పిల్ల నిచ్చి మొగుని వెంట పంపిన వెన్క
కూతు కాపురాన కోరి వేలు
వెట్టరాదు! కంటివే విదేహ పతిని!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 144

అవసరమ్ము దీర నసలు నీవెవరను?
నరుల నైజ మెఱుఁగఁ దరచి చూడు
పూజ ముగియ వేలుపున్ నీట ముంచేరె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 145

అంటుకొనఁగ నిన్ను నగ్గివంటి యహము
మంచి గుణము లన్ని మాఁడి పోవు
విడిచి దాని వెస వివేకివై మసలుము!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 146

పుట్టతేనె పోని పుణ్యచరిత వ్రాసి
పూత చరితుఁడయ్యెఁ బుట్టపుట్టు
వదియ కాద కవికి నమృతత్వ సంగతి!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 147

బురదలోన నడువ ముఱికియౌఁ గాళ్ళకె!
చెడ్డ వానిఁ జేరి చేయి కలుప
మొగము వరకు ముఱికి యగు నంచెఱుంగవొ!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 148

మనిషి మనిషి చేంపుకొనెడి మతమదేల?
మనిషి  మనిషిఁ జేయ మతము పుట్టె!
కొత్తమాట కాదు కొసరి చెప్పితినంతె!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 149

నీ బ్రతుకు బ్రతుకఁగ నీకిష్ట మౌరీతి
హక్కు కలదు నీకు నిక్కమేను!
ప్రక్కవాడి బ్రతుకు బండలు సేయకు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 150

స్వీయ హితముఁ గోరి చేయు కార్యపరుని
స్వార్థ పరుఁడనుకొను భావమేల
ఖాళి గిన్నె పరుల కడుపు నింపఁ గలదె
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 151

అరయ నిడ్లి ముక్క నారగించే నొకటి
పరగడు పనగ నది వట్టి మాట!
చెప్ప నొకరి కింకఁ జెల్లునొ గుట్టన!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 152

స్వచ్ఛమైన మనసు పసిపాప కుండును
చుట్టు జనుల చెడును బట్టు చెదుగు!
కడలి నీలిరంగుఁ గనపడి నట్లొచు!
కవి ప్రసాదు మాట కాస్త వినవొ! 153

(హమ్మయ్య! ఐపోయినాయండీ!)
మంగళమ్ పాఠకేన్ద్రాయ మహనీయ గుణాత్మనే!

-- :: సమాప్తం :: --



# కవి పరిచయం

**రచయిత:** కవితా (వేంకట సూర్య నారాయణ) ప్రసాద్
**జననం:** 1955
**ఊరు:** అవనిగడ్డ, కృష్ణాజిల్లా (ఆం.ప్ర)
**తల్లిదండ్రులు:** వాస్తు జ్యోతిష విద్వాన్, దైవజ్ఞరత్న బ్రహ్మశ్రీ కవితా కామేశ్వర శర్మ, రాజ్యలక్ష్మి.
**చదువు:** MSc (chemistry), PG Dip. (Appd. Statistics),(PhD)
స్కంధ త్రయ జ్యోతిషము (వారసత్వము).
**వృత్తి:** D.G.M (retd.), ONGC.
**అభినివేశము:** పద్య, వచన కవిత్వములు, కథారచన,
వాస్తు జ్యోతిష ముహూర్త శాస్త్రములు.
**రచనలు:** వివిధ పత్రికలలో పద్య గద్య కవితలు, కథలు, వ్యాసాలు,
ఆకాశవాణి పద్య సమస్యాపూరణలు,
వివిధ కవితా సంకలనములలో రచనలు.

**గ్రంథములు:** శ్రీ రాజశేఖర శతకము,
శ్రీ వేంకటేశ్వర ద్విశతి,
కొరోన వారణార్థనా పద్యపంచాశిక
కావవే కామేశ్వరీ!! (శతకము),
ప్రవచన కవితా (౨) కవితలు (వచన కవితా సంపుటి),
మాటవెలదులు (పరశ్శతకము),
ప్రపద్యాపీడము (ఖండ పద్యకవితా సంపుటి),
ఇష్టకథాష్టకము (కథాసంపుటి),
ముహూర్త కామేశ్వరము. మొ.




31.12.2019 రాజమండ్రి శతావధాన పృచ్ఛకత్వ సన్మానము




"కళాగౌతమి" రాజమండ్రి శార్వరి ఉగాది కవితాగోష్ఠి   సందర్భంగా